## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010001458

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Author's Last Name**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Year**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |

**Subject**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |

**Language**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014




శ్రీ చలసాని సుబ్బారావు, ఎం. ఏ.,
సాహిత్యాలంకార్

వసంత పబ్లికేషన్సు, తెనాలి.

# శరత్ చంద్రచటర్జి

సుప్రసిద్ధ నవలారచయిత :
మానసిక తత్వశాస్త్రవేత్త, శరత్‌బాబు జీవితగాధ.



శ్రీ చలసాని సుబ్బారావు, ఎం., ఎ.
సాహిత్యాలంకార్ — సాహిత్యరత్న



వసంత పబ్లికేషన్సు,
తెనాలి.

 1958 [ 62 న. పై.

# మనవి

సమాజంలో సాహిత్యకారుని విలువ 'ఇంత' అని మనం నిర్ణయించలేము. తన రచనల ద్వారా సాహిత్యకారుడు సంఘ శ్రేయస్సుకు జరిగే నిర్మాణాత్మక కృషిలో అద్వితీయమైన పాత్ర నిర్వహిస్తాడు. అతను తన సూక్ష్మదృష్టితో సంఘజీవితంలో ఎక్కడ లోటువుందో సునాయాసంగా గుర్తిస్తాడు. కాంతా సమ్మితమైన తన కలం ద్వారా ఆ లోటును సంఘంచేత గుర్తింప జేస్తాడు. అదే అతనిలోనున్న విశిష్ట ప్రతిభ. సంఘానికతను మహాశిలాంటి వాడు. మానవుని గత జీవితాన్నతను పరిశీలిస్తాడు. అనుభవం గడిస్తాడు, ప్రస్తుత పరిస్థితులకు వాటిని అన్వయించుకుంటాడు, ముందుకు సాగుతాడు. ఇదంతా భావి శ్రేయస్సునుకూడ దృష్టి నందిడుకునే సుమా! అతను భావుకుడు, పరిశీలకుడు. అతను స్రష్ట, ద్రష్ట; సృజిస్తాడు, స్పృశిస్తాడు. తన జీవితంలో అతను గాంచిన ప్రతి చిన్న దృశ్యము, ప్రతి చిన్న ఘటన అతని రచనలో సంఘాన్ని ఝంఝూ మారుతంలా వూపివైచే ఒక పెద్ద సంఘటనగాను, సమస్యగాను రూపొందుతుంది. అదే అతని సాహిత్య సృష్టికి నాంది, కళాసౌధానికి పునాది.

సాహిత్యకారు డెప్పుడు సత్యాన్వేషియే. సత్యాన్వేషణమే అతని విశుద్ధ సాహితీహృదయానికి స్పందనము. అన్యాయాన్ని, అక్రమాన్ని, అనౌచిత్యాన్ని అతను చూస్తూ మిన్నకుండలేడు. జనుల దైన్యాన్ని చూచి అతను తన ధీరత్వాన్ని కోల్పోతాడు. తన అంతస్తును చంపుకొని వారి దయనీయ స్థితిలో భాగం పంచుకుంటాడు. దాని నొక మహత్కార్యంగా భావించి అందుకొరకు దుర్భరమైన దారిద్ర్యాన్ని కూడ సహర్షంగా ఆహ్వానిస్తాడు. శరత్ చంద్రుని జీవితంలో యిటువంటి సంఘటనలు మన కడుగడుగున గోచరిస్తాయి.

ఉత్తమ సంస్కారంగల సాహిత్యకారునిద్వారా సృజియింపబడిన సాహిత్యం ఆ జాతియొక్క సంఘజీవితానికి ప్రతిబింబంగానే

ఉంటుంది. ఆ జాతియోచించే దేమిటో, చెప్పేదేమిటో, చేసే దేమిటో ఆ రచనలో మనకు వ్యక్తమవుతూంటుంది. ఎందుచేత నంటే నిజమైన కళాకారుడు నేలవిడిచి సాము చేయడుగదా! అతను గాలిలో మేడలు కట్టడు. అతను మానవుని సామాన్య జీవితాన్నా ధారం జేసుకొని కళాసృష్టికి పూనుకుంటాడు. అందులో అతను తన జీవితానుభవము, ప్రతిభ, కల్పనాపటిమవల్ల ఆ సామాన్య పరిస్థి తుల నధిగమించి శాశ్వతమైన ఒక విశిష్ట స్థానాన్నందుకుంటాడు. తెలుగు సాహిత్యక్షేత్రంలో కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు; వంగసాహిత్యంలో రవీంద్రనాథ ఠాకూరు, బంకిమ్‌చంద్ర చటోపాధ్యాయ్, శరత్ చంద్ర చటర్జీ; హిందీ సాహి త్యంలో సర్వశ్రీ ప్రేమచంద్, జైనేంద్ర కుమారులు యీ తరగతికి చెందిన కళాకారులే. జాతియొక్క సాంస్కృతిక జీవనానికి ప్రతి రూపాలయిన తమ రచనలద్వారా వీరు నాటికీ, నేటికీ, ఏనాటికికూడ సజీవులే.

ఈ చిన్ని పొత్తంలో సాటిలేనిమేటి నవలారచయితగా ప్రఖ్యాతి బడసిన (శ్రీ) శరత్ చంద్ర చటర్జీ యొక్క జీవితగాథ సంస్మరించ బడింది. నేనింతకు ముందు నుడివినట్లు—సాహిత్యం మానవ జీవితానికి ప్రతి బింబము. కళాకారుని ప్రతిభ అతని కళాఖండంలో తొంగిచూస్తుంటుంది. సాహిత్యకారుని రచనలలోని వైశిష్ట్యాలు నిజంగా అతని వ్యక్తిగత జీవితాన్నుంచే స్ఫూర్తిని పొందుతూ వుంటాయనే విషయం మాత్రం సర్వసామాన్యం. శరత్ బాబు రచనలకుకూడ ఆయన వ్యక్తిగత జీవితం చాలవరకు ప్రేరకంగా పనిజేసింది. ఈ విషయం యీ లఘు సంస్మరణవల్ల స్పష్ట మవు తుంది. ఈ చిన్న పుస్తకం సామాన్యుల కర్థమయ్యేట్లుగా సులభ మైన వ్యావహారిక శైలిలో వ్రాయబడింది. శరత్ జీవితంలోని ముఖ్యసంఘటన లన్నిటిని ముక్తసరిగా ముచ్చటించేందుకు ప్రయ త్నించితిని. దీని ప్రయోజనమును పాఠక మహాశయులే నిర్ణ యింతురుగాక !

రచయిత

# శరత్ చంద్ర చటర్జీ

అమాయకులైన గ్రామీణ ప్రజలను జమీందారులు దోచుకు తినే రోజులవి. వంగదేశంలోని గ్రామాలన్నీ చాలవరకు ఆ రోజులలో జమీందారుల ప్రాబల్యంలో నుండేవి. అనేక రైతుకుటుంబాలు వారి దోపిడికి గురై పోతుండేవి. జమీందారుల అమానుష కృత్యాలకు నిజంగా మానవత్వమే సిగ్గుపడే దినాలవి. దేనికయినా ఒక హద్దు వుంటుంది. పీడితప్రజలు కూడ మానవులేగదా! వారికి హృదయముంది. జీవించాలనే కాంక్ష, అందులోనూ సుఖంగా జీవించాలనే వారికికూడ వుంటుంది. వారు ఆత్మగౌరవాన్ని ఆత్మస్వాతంత్ర్యాన్ని ఆశిస్తూవుంటారు. జమీందారుల మితిమీరిన అత్యాచారాలకు విసిగి, విసిగి చివరకు ఎదురు నిలిచారు ప్రజలు. ఆత్మగౌరవం కొరకు పశుత్వంతో పోట్లాడే ప్రజలకు నాయకత్వం వహించాడు మన శరత్ చంద్రుని తాతగారు. రాక్షసత్వాని కెదురు తిరిగి తగిన ఫలితాన్ననుభవించాడు పాప మాయన. జమీందారు లాయనపై కుట్రలు పన్ని తుదకాయన తల నరికి గంగానది కర్పించారు. మహాఘోరం.

ఆ భయంకర దుర్ఘటనతో శరత్ చంద్రుని నాయనమ్మ భయపడి తన ఏకైక పుత్రునితో ఆ గ్రామాన్ని వదలి వెళ్ళింది. ఆమె తన పుత్రుడైన మోతీలాల్‌ను దేవానంద పురంలో తనకు దగ్గరైన ఒక బంధువుని యింట విడిచిపెట్టింది. మోతీలాలు నాయనే పెంచి పెద్దవానిగా చేశాడు. మోతీలాలు చిన్నతనంనుంచి చక్కని నడవడిగలవాడు. ఆయన

శ్రద్ధతో చదివేవాడు. కుర్రవాని గుణగణాలను చూచి ఆయ నను పెంచి పెద్దవానిగా జేసిన ఆ బంధువే తన మనుమరాలి నాయనకిచ్చి వివాహం జేశాడు. ఆమె గర్భమున మోతీలా లుకు కలిగిన పుత్రుడే మన సుప్రసిద్ధ నవలారచయిత శరత్ చంద్ర చటర్జీ.

దేవానందపురము అనే ఒక కుగ్రామంలో 1876 సం॥ సెప్టెం బరు 15 వ రోజున శరత్ బాబు జన్మించాడు. ఆర్థికంగా పేద కుటుంబములో జన్మించినప్పటికి సాహిత్యంగా మాత్ర మది ఉన్నత కుటుంబమనే చెప్పాలి. శరత్ తండ్రి మోతీ లాలు కథలు, కవిత్వాలు వ్రాస్తూవుండేవాడు. కాని ఆయన తన రచనలను ప్రచురించాలని అభిలాషపడేవాడు మాత్రం గాదు. ప్రచురించలేదుకూడ. ఆయన తన మిత్రులకు చదివి వినిపించుటలోనే మహదానందాన్ననుభవిస్తూ వుండేవాడు. అందుకొరకు తరచుగా ఆయన యింట్లో సాహిత్యగోష్ఠులు జరుగుతుండేవి. ఆ ప్రభావం శరత్ చంద్రునిపై చక్కగా ప్రసరించింది. శరత్ తన రచనా సంస్కారాన్ని తన తండ్రి నుంచే పొందాడనడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు.

పేదరికంవల్ల మోతీలాల్ జైలులో యిరువదిఐదు రూపాయల మాస వేతనంపై పని చేస్తూండేవాడు. శరత్ చంద్రుడు దేవానందపురములోని ప్రాథమిక పాఠశాలలో చేరాడు. ఆయనకు చదువుపట్ల అంతగా శ్రద్ధవుండేదిగాదు. మిత్రులతో గూడి కొంటెపనులు చేయడం ఆయనకు సరదా. ఆయన

కొంటెపనులకు స్కూలులోని మాష్టర్లు, యింటివారు, బయటివారుకూడ విసుగుజెందేవారు. ఈ లోపుగా వారి దురదృష్టవశాత్తు మోతీలాలుకున్న 25 రూపాయల నౌకరీ కూడ పోయింది. దానితో ఆయన కుటుంబాని కొచ్చిన దుస్థితిని గమనించి ఆయన మేనమామగారా యనను భాగల్పూరుకు తీసికెళ్ళాడు. శరత్ గూడ దేవానందపురమునుంచి భాగల్పూరు చేరుకున్నాడు.

భాగల్పూరు వెళ్ళిన తరువాతకూడ శరత్ తన కొంటె స్వభావాన్ని విడనాడలేదు. ఆయన కప్పటికి ఏడు సంవత్సరముల వయస్సు. తన వయస్సువారి నొక సంఘంగా సమాయత్త పరచి వారిచే అనేక ఆకతాయి పనులు చేయించేవాడు. చెట్లెక్కడం, కోతికొమ్మంచిలాడడం, తోటల్లో పండ్లు కోయడం, తిన్నన్ని తిని మిగతావాటిని పారవేయడం, తోట మాలి వస్తే అతని నెగతాళిచేసి పారిపోవడం మొదలగు పనులు వారి నిత్య కృత్యాలు. శరత్ బాల్యచాపల్యాని కీ క్రింది ఘటన చూడండి. శరత్ చంద్రుని యింట్లో ఒక పెంపుడు కోయిల వుండేది. అది మాట్లాడేదిగాదు. అది మాట్లాడేందుకు శరత్ చంద్రుడు చక్కని ఉపాయమొక టాలోచించాడు. తన అనుచరులకు మిరియాలు పొడిచేసి ఆ పొడిని మామిడాకులలో పెట్టి దానిని తినిపించవలసినదిగా ఆజ్ఞాపించాడు. అతని శిష్యులా విధంగానే మిరియాల పొడిని తినిపించారు. మరునాటి వేకువజామున శరత్ చంద్రుడు ఆతురతతో కోయిల పాడుతుందని, ఆ పాట విందామని

గంపెడాశతో పంజరం దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు. కాని పాపమా పక్షి చచ్చి పంజరంలో పడివుంది. ఆయన చాల విచారించాడు. ఈ విధంగానే ఆయన తన అనుచరులతో గూడి చేపలు పట్టేవారిని అమితంగా బాధపెట్టేవాడు. రాత్రుల సమయాన వారి చేపలను దొంగిలించేవాడు. ఇతరుల పెరటి చెలమలలోనుంచి రాత్రివేళలందు గాలాలతో సహా వెళ్ళి చేపలను పట్టి తెచ్చేవాడు.

బాలకుడైన శరత్‌చంద్రుడు కేవలం ఆకతాయేగాదు. అతను దయాళుడుకూడ. ఆ చిన్న వయస్సులోనే యితరుల కష్టాల నాయన చూడలేక పోయేవాడు. పేదప్రజలపట్ల ఆయనకు విపరీతమైన సానుభూతి ఉండేది. అనేక సమయాలలో వారికి ధనసహాయంకూడ చేసేవాడు. ఆయనది మెత్తని హృదయము. ఆ మెత్తని హృదయం వల్లనే ఆయన తన జీవితంలో అనేక యిబ్బందులకు గురయినాడు. నిరుపేదలయిన రోగుల కాయన చేసిన సహాయం మరువరానిది. ఈ సహాయముల కాయనకు డబ్బెక్కడినుండి వస్తుంది, అనే సందేహం మీలో కలుగవచ్చు. ఎక్కడనుంచో కాదు. తన స్నేహితులతో ఆకతాయితనంగా తిరుగుతూ సంపాదించే వస్తువుల నమ్మి, ఆ ధనాన్నాయన పైవిధంగా ఖర్చుపెట్టేవాడు. మనలాగా చిరుతిండ్లకు, జూదములకు, గాలిగా తిరుగుటకు మాత్రమాయన ధనాన్ని ఖర్చుచేసేవాడు గాదు. రాత్రిసమయాల్లో దొంగిలించిన చేపలను, తోటల్లో తస్కరించిన పండ్లను బజార్లలో అమ్మి ఆ ధనాన్ని రోగులకు, అసహాయులకు పంచుతూండే

వాడు. ఎంత గొప్ప విషయమో యోచించండి. తన స్వగ్రామంలో నొక పర్యాయం కలరా వ్యాపించింది. అప్పుడాయన తన అనుచరులతో ఆ కలరా రోగులకు చేసిన సేవ, చూపిన సాహసము మరువరానివి.

దీనుల దైన్యాన్ని చూస్తే ఆయన తన ధీరత్వాన్ని కోల్పోయేవాడు. ఇతరుల దుఃఖాన్ని చూస్తే ఆయనహృదయం నీరయ్యేది. ఆరోజు కృష్ణాష్టమి. వంగదేశంలో కృష్ణాష్టమి వేడుకగా జరుపబడుతుంది. బజారులన్నీ పిన్నలతో, పెద్దలతో కోలాహాలంగా వున్నవి. అనేకమంది యువకులు లేసులవాని యంగడిముందు వ్రేలాడ గట్టిన ఉట్టి నందుకొనేందుకు ఉత్సాహంతో నడుస్తున్నారు. శరత్ కూడ తన స్నేహితులతో ఆ వినోదానికి బయలుదేరాడు. దారిలో గణేశ్ కువర్ పార్కు దగ్గర ఒక భిక్షుకి తన యిరువురు పిల్లలతో తటస్థపడింది. ఆమెకు వేరే మగదిక్కు లేదు. ఏదో బజార్ల వెంట ప్రొద్దస్తమానము యాచించుకొని, ఆ వచ్చిన నాలుగు డబ్బులతో మరమరాలో లేక జొన్నపిండో (సత్తూ) కొని పిల్లలకుపెట్టి, కొద్దోగొప్పో మిగిలితే తాను దిని ఆ దగ్గరలోనేఉన్న జీర్ణ దేవాలయపు పంచన రాత్రుళ్లు తలదాచుకుంటూ వుంటుంది. శరత్ను చూచి ఆమె తన పిల్లల, ఎండకు ఎండి వానకు తడిసే, జీర్ణ శరీరాలను చూపించి ఖిన్నురాలయి నిలబడింది. ఆమెను చూడగానే శరత్ మనస్సు నిలువున నీరయ్యింది. ఆ స్థితిలో తనేవుంటే ఎలావుండేదో అనే భావం అతనిలో చటుక్కున మెరిసింది. తను ఆ దయనీయస్థితిలో లేడు

గనుక అందుకొ సర్వేశ్వరునికి కృతజ్ఞతా సూచకంగా ఆ ఉపేక్షిత జీవానికి కొంత సహాయం చేయడం ఎంతయిన సముచితమనే భావం కలిగింది. వెంటనే ఆయన తన జేబు తడుముకున్నాడు. పండుగ వేడుకల నిమిత్తమాయన తండ్రి చ్చిన ఒక అర్ధరూపాయి డబ్బులు ఆయన చేతికి తగిలినవి. సంకోచించకుండ అర్ధరూపాయిబిళ్ళ ఆ భిక్షుకి చేతిలో పెట్టాడు. ఆమె సంతోషానికి మేరలేదు. 'దిక్కులేని నా లాంటి వాళ్ళకొరకే భగవంతుడు తమరిని పంపినాడీ లోకా నికి' అని ఆ నిర్భాగ్య కంఠం పలికింది. చూడండి శరత్ చంద్రుని ఔదార్యం! చిన్నతనంలోనే ఆయన కలవడిన సహృదయత, సేవాభావం గమనార్హామయినవి. ఆశ్చర్య మేమంటే ఆనాడు భిక్షుకి కంఠంనుంచి పలికిన స్వరం అక్షరాల సత్యమయిందేమో అన్నట్లుగా ఆయన తన జీవితాంతము నిర్భాగ్యురాండ్రయిన స్త్రీల కొరకు అనేక యిక్కట్టుల పాలుగావలసి వచ్చినది.

## సాహిత్యాభిరుచి

చిన్నతనంనుంచి శరత్‌కు పుస్తకాలు చదివే సరదా వుండేది. ఆకతాయి స్నేహాలతోనో, అల్లరి పనులతోనో అతని సమయ మంతా ఖర్చవుతూ వున్నప్పటికిని ఏదోవిధంగా తీరిక చేసు కొని ప్రతిరోజు కొంత కాలాన్ని గ్రంథపఠనమున కాయన వినియోగించేవాడు. ఇది ఆయనలోనున్న శ్రద్ధ, పట్టుదల, జిజ్ఞాసలను వ్యక్తపరుస్తూంది. చిన్న వయస్సులోనే ఆయన

చాల పెద్దపెద్ద పుస్తకాలను చదివాడు. చిన్నతనంనుంచి ఆయనకు రవిబాబుపట్ల అపారమైన గౌరవముండేది. ఆయన పుస్తకాలను తరచుగా చదువుతూండేవాడు. రవిబాబు పుస్తకాలతోపాటు శరత్ తన తండ్రిగారు రచించిన కొన్ని పుస్తకాలనుకూడ చాల శ్రద్ధతో చదివేవాడు. చదవడంతో సరిపెట్టుకొనేవాడు కాదాయన. స్వయంగా చిన్న చిన్న కథలనుకూడ వ్రాస్తూండేవాడు. ఇదే ఆయనలో నున్న విశేషము.

స్కూలు చదువులో మాత్రం ఆయన తన తోటి విద్యార్థులకంటె వెనుకబడివుండేవాడు. క్లాసులోని తెలివిగల విద్యార్థులలో మాత్రం మీాయనను లెక్కించడానికి వీలులేదు. క్లాసు పుస్తకాలు చదివేందుకు ఆయన మనస్సే అంగీకరించేదిగాదు. క్లాసు పుస్తకాలంటేనే ఆయనకు తలనొప్పి, ఎంతవరకు యితర పుస్తకాలు, నవలలు – కథలు చదువుతూండేవాడు. కాని విచిత్రమేమంటే ఆయన పరీక్షలలో మాత్ర మెప్పుడును తప్పలేదు. కారణమేమంటే పరీక్షకుముందు ఆయన పట్టుదలతో క్లాసు పుస్తకాలను చదువుతూండేవాడు. ఈ పద్ధతి ఆయనకే నచ్చేదిగాదు. అయినా పరీక్షలకొరకా విధానం తప్పనిసరయింది. ఆర్థిక యిబ్బందులవల్ల నిజంగా ఆయన చదువంతగా సాగలేదు. కొన్ని ప్రతిబంధకాలవల్ల యింటరు పూర్తిజేసిన పిమ్మట శరత్‌బాబు తన చదువుకు స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఆయన విద్యార్థిజీవిత మంతటితో ముగిసింది.

తండ్రిగారి కుద్యోగము లేకపోవుటవల్ల వారి కుటుంబానికి సంభవించిన ఆర్థిక దుస్థితికి తలొగ్గి శరత్ తన చదువును మాని ఏదో ఉద్యోగాన్ని వెతుక్కోవలసి వచ్చింది. ఆయన ఒక షావుకారు దగ్గర చిన్నగుమాస్తాగా చేరాడు. గుమాస్తాగిరి కాయన నెలా సంతుష్టిపరచ గలుగుతుంది? ఆయన స్వతంత్ర ప్రకృతి గలవాడు. ఒకని చేతిక్రింద నౌకరీ చేయడ మాయనకు రుచించలేదు. కాని ఏం చేయగలడు? తన నెదుర్కొన్న ఆర్థిక యిబ్బందులవల్ల ఆయన కొలువుని నిర్వహించక తప్పలేదు. నిర్వహిస్తూనేయున్నాడు. ఇంతలోనే అనేక యిబ్బందులు దాపురించినవి. శరత్ తల్లి ఆడ శిశువును ప్రసవించి చనిపోయింది. పిల్లల పోషణ నిమిత్తము మోతీలాలు ఒక దాదిని నియమించాడు. ఆమె మొదట్లో పిల్లలను బాగుగానే సాకింది. కాని కొంతకాల మయిన తరువాత ఆమె స్వార్థబుద్ధితో పిల్లల శ్రేయస్సుకు భంగకరంగా ప్రవర్తించ సాగింది. శరత్ చంద్రుని కామె ప్రవర్తన బాధాకరంగా పరిణమించింది. ఆయన దాదిని గురించి అనేకసార్లు తన తండ్రికి ఫిర్యాదు చేశాడు. కాని ఆశ్చర్యమేమంటే మోతీలాల్ దాది ప్రభావానికి లోనయ్యాడు. ఆయన శరత్ ఫిర్యాదులను లక్ష్యపెట్టలేదు సరిగదా దాదిని మందలించను గూడ మందలించలేదు. తండ్రిగారి ఈ అనుచిత చర్యను శరత్ సహించలేక పోయాడు. అందుకు నిరసనగా శరత్ యింటినుంచి వెళ్ళిపోయాడు.

ఇంటినుంచి ఎవరికీ చెప్పకనే బయలు దేరాడు. ఆయన మనస్సు చాల బాధపడింది. తలవని తలంపుగా నెదుర్కొన వలసి వచ్చిన యిక్కట్లులకు ఆయనమనస్సు ఆవేదనతో కృంగి పోయింది. ఇల్లు వదలినాడేగాని ఎచ్చటకు వెళ్ళాలనేది ఆయన నెదుర్కొన్న చిక్కు సమస్య. ఆఖరి కాయన జగన్నాథపుర మెళ్ళాలని నిర్ణయించుకొన్నాడు. బయలు దేరాడు. నడుస్తూ నడుస్తూ అలసిపోయాడు పాపం. మార్గ మధ్యమున నొక చెట్టుక్రింద కొంచెంసేపు విశ్రమించుదా మని అనుకుంటూ ఆ చెట్టునీడకు చేరడంతోనే పాప మాయన అశక్తతతో స్పృహలేకుండ అక్కడ పడిపోయాడు అదే సమయంలో ఆ దారినుంచి ఒక స్త్రీ రావడం తట స్థించింది. ఆమె చేతులకు గాజులులేవు. నొసట తిలకంలేదు. వేషమునుబట్టి చూస్తే ఆమె విధవరాలని స్పష్టమవుతూంది. ఆమె నిస్సహాయు డయిన శరత్ ను తదేక దృష్టితో చూస్తూ కొంచెంసేపు నిలబడింది. ఏమి ఆలోచించిందో ఏమో; వెంటనే వెనుకకుదిరిగి వెళ్ళి కొంచెం సేపటికి పాత్రలో నీళ్ళు తీసికొని వచ్చింది. ఆ నీటి నాతని ముఖంపై చిలకరించింది. ఆమె బహుశ శరత్ ను యింటినుంచి అలిగివచ్చిన యువ కునిగా మాత్రం గుర్తించి ఉంటుంది. స్త్రీ సహజమైన స్నేహభావంతో ఆమె ఆ యువకుని తట్టి లేపింది.. శరత్ కంగారుగా లేచి కూర్చున్నాడు. ఆమె అతని యింటినుంచి బయలు దేరివచ్చిన కారణ మడిగింది. పూరీ యాత్రకు బయలు దేరితినని జవాబు చెప్పాడు. ఆమె అతనిమాటలు నమ్మలేదు 'అయితే యిచ్చట పడిపోవలసిన కారణం?' ఆమె ప్రశ్నిం

చింది. 'ఆకలివల్ల తల్లీ, నాలుగు దినములనుండి అన్నము లేదు' అని ఆయన సమాధాన మిచ్చాడు. ఆమె హృదయం ద్రవీభూతమయింది. ఇంటివారితో కలహించకుండ యాత్రకు బయలుదేరిన యువకునకు నాల్గు దినములనుండి పస్తుండవలసిన అగత్యమేముంటుందనికూడ ఆమె స్త్రీహృదయము తర్కించుకోలేదు. ఆమె మనస్సు ఆరాట పడింది. వెంటనే ఆమె శరత్‌ను బ్రతిమాలి ఆతనిని తన యింటికి దీసికొని వెళ్ళింది. యథోచితంగా సత్కరించింది. మరునాడు శరత్‌కు ఆమె యింటిదగ్గరే తీవ్రంగా 104; 105 డిగ్రీల వరకు జ్వరం తగిలింది ఆ యువతి రాత్రింబగళ్ళు శక్తివంచన లేకుండ ఎంతో శ్రద్ధతో ఆయనకు సేవ జేసింది. ఆమెచేసిన సేవకు చూపిన ఆప్యాయతకు శరతు ప్రభావితుడైనాడు. కాని ఆమె జీవితాన్ని చూచి జాలిపడ్డాడు. ఆమె కాయింట్లో గౌరవంలేదు. ఇంటిలోని చిన్నలకు పెద్దలకు ఆమె జీతంభత్యంలేని దాసి. తన మరిది బావల ప్రాబల్యాని కామె తలవంచి నానా బాధలు పడుతూంది. వారి క్రూరత్వాల కామె ప్రతిరోజు బలి అవుతూంది. ఆ యింట్లో యీ ఘోరాన్ని శరత్ తన కన్నులారా చూచాడు. కాని ఏమిచేయగలడు? ఆమె ఒకరోజున యింట్లో తననుపెట్టే హింసను భరించలేక శరతును ఆ నరక కూపంనుంచి తన్ను రక్షించమని ప్రాధేయపడింది. శరతు జాలిపడ్డాడు. తికమకపడ్డాడు, బాధపడ్డాడు. తీవ్రంగా యోచించాడు. 'తాదూర సందులేదు మెడ కొక డోల'న్నట్లు తనకే ఒక దారి తెన్ను లేదుగదా! ఆమెనెలా రక్షించగలడు? ఆమె దైన్యాన్ని చూడలేక ఆఖరికి సాహసించాడు. పీడితురాలయిన

అబలను ఉద్ధరించాలనుకొన్నాడు. ఒకనాటి తెల్లవజామున వారిరువురు యింట్లోవారికి తెలియకుండ పరారయినారు. ప్రయాణం చేసి చేసి జాము ప్రొద్దెక్కిన తరువాత వారిరువురు అలసట తీర్చుకొనేందు కొక చెట్టుక్రింద విశ్రమించారు. ఈ లోపుగా యింటిదగ్గర కలకలం బయలుదేరింది. ఆ విధవరాలి మరదులు, బావలు కొంతమంది గ్రామప్రజలను వెంటదీసికొని ఆ వైపుకే పరుగెత్తుకొచ్చారు. వారినిచూచి ఆమె గుండె లవిసిపోయినవి. ఆమె శరతు కాళ్ళమీద పడి రక్షించమని ప్రాధేయపడింది. కాని పాప మా అభాగ్యుడు మాత్రం చేయగలిగిందేముంది నిజంగా! అతని మనస్సు మాత్ర మారాటపడింది కాని ప్రతిమవలె నిలబడిపోయిందతని శరీరము. కొంతసేపటికా రాక్షసులు రావటం ఆమెను చానమోదుకుంటూ ఇంటికీడ్చుకెళ్ళడం జరిగిపోయింది. ఆమె రోదనము విని శరతు హృదయం కరిగిపోయింది. ఆవేదనతో బాధపడ్డాడు. కాని అతనేమి చేయగలడు? గుడ్లప్పగించి చూస్తూ వూరకున్నాడు. కాని ఆ హృదయ విదారకమైన దృశ్య మతని మనస్సును కదిలించివేసింది. సమాజంలో కొందరిపై జరిగే ఘోరమైన అన్యాయాలు అఘాయిత్యాలు ఆయనకుబోధపడ్డాయి. అవి ఆయన మనస్సుకు హత్తుకుపోయినవి. మానవత్వాన్నే కదిలించివేసే ఆ యువతి ఆక్రందనము శరత్ చంద్రుని చెవులలో జీవితాంతము ప్రతిధ్వనిస్తూ వుండేది. ఆ కరుణారోదన ప్రభావమే ఆయన రచనలలో నున్న స్త్రీ పాత్రల ముఖంగా భారతీయ సమాజాన్ని కదిలించి వేసింది.

## ముజప్ఫర పురములో

శరత్ చంద్రుడు తిరిగి తిరిగి ఆఖరుకు ముజప్ఫరపురం చేరుకున్నాడు. ముజప్ఫరపురం బీహారు ప్రాంతమునకు ముఖ్య పట్టణమైన పాట్నాకుత్తరంగా పాతిక మైళ్ళ దూరంలో వుంది. జనకమహారాజు పాలించిన మిథిలకు యిది సరిహద్దుననున్నది. అచ్చట ఆయనకొక మంచి ప్రాపకము లభించింది. ఆ మహాశయుని ప్రోత్సాహం వలన శరతు అక్కడ సంగీతం నేర్చుకొన వలెననే అభిలాషేర్పడింది. సాధన ప్రారంభించాడు. ప్రయత్నము వ్యర్థముగా లేదు. కొలది దినాలలోనే ఆయన అచ్చటొక ప్రసిద్ధ గాయకుడుగా పేరుపొందాడు. అతని సంగీతానికి ప్రభావితుడై అచ్చటి సుప్రసిద్ధ గాయకుడు మహాదేవసాహు శరతును తన యింటికి ఆహ్వానించాడు. శరతు ఆయన యింట్లోనే కొన్ని సంవత్సరములు గడిపాడు. ఆ సుప్రసిద్ధ గాయకుని సాహచర్యంతో శరతు సంగీతంలో ప్రావీణ్యం సంపాదించాడు. శరతు సాటిలేని నవలా రచయితే గాకుండ చెప్పుకోదగ్గ సంగీతజ్ఞుడని మనలో ఏ కొద్దిమందికో తెలుసు ననుకుంటాను. ఆయన జీవితము ముజప్ఫరపూరులో సుఖపూర్వకంగానే గడచింది. ఆయనరచించిన శ్రీకాంత అనే నవల ముజప్ఫరపూరులో అతని జీవితానికి, అచ్చట పరిస్థితులకు ప్రతిరూపంగానే వున్నదని చెప్పటలో అతిశయోక్తి లేదు.

## తండ్రిగారి మృత్యువు

శరత్ ముజఫ్ఫరపూరులో నుండే రోజులలోనే ఆయన తండ్రిగారు పరమపదించారు. ఇదొక పిడుగువంటి వార్తాయనకు. దీనితో యిన్నిసంవత్సరములనుండి తనను గౌరవంతో పోషించిన ముజఫ్ఫరపూరును వదలి మరల భాగల్పూరు చేరుకోవలసి వచ్చింది. అచ్చటాయన మరల దుర్భర జీవితాన్ని ప్రారంభించాడు. అనేక క్లిష్టపరిస్థితుల నెదుర్కొన్నాడు. కుటుంబభారమంత ఆయనపైనే పడింది. స్వచ్ఛంద జీవితాని కలవాటు పడివున్న శరతుకు కుటుంబనిర్వహణ భారం అతికష్టంగానే తోచింది. అయినా తప్పదుగదా! కుటుంబ నిర్వహణ కొరకాయన ఉద్యోగం కూడ చేయవలసి వచ్చింది. తప్పలేదు. చివరికొక యింగ్లీషు కంపెనీలో రైటరుగా చేరాడు. అక్కడాయనకు ఇంగ్లీషు ఉత్తరాలను హిందీలో కనువదించే పని అప్పగించ బడింది. శరతు చంద్రుని మాతృభాష బెంగాలీ. ఆయన హిందీని రెండవ భాషగా అభ్యసించాడు. హిందీ భాషా జ్ఞానముకూడ ఆయనకు బాగుగానే అలవడింది. ఏమయినా ఆయనెక్కువ కాలమక్కడుండలేక పోయాడు. ఆ రోజులలో బర్మాలో వుంటూవుండిన కొందరు సజ్జనులాయనకు మిత్రులుగావటం తటస్థించింది. ఆయనకు కూడ బర్మా వెళ్ళవలయునని యభిలాష కలిగింది. అసలే స్వచ్ఛంద ప్రకృతిగలవాడు. ఒకచోట నిలకడగా ఉద్యోగముచేయడం ఆయన స్వభావానికే విరుద్ధం. వెంటనే అనువాదకుని పదవికి రాజీనామా నిచ్చి బర్మా వెళ్ళిపోవాలని నిర్ణయించు కున్నాడు.

## రచనాభిలాష

శరత్ చంద్రునికి కథలు వ్రాయాలని అభిలాష-ఉత్సాహము బాల్యావస్థనుంచి వున్నవి. ఎప్పుడూ ఏదో వ్రాస్తూనే వుండే వాడు. తన తండ్రిగారి డైరీలో ఒక పర్యాయం ఆయ నీ విధంగా వ్రాశాడు:— "నేను యింటినుంచి బయలుదేరితిని. రోడ్డుపై సతీశుడు కలిశాడు మేమిరువురం ఆ అమ్మాయిని గురించి మాట్లాడుకుంటు పోతున్నాము. దబ్బపండు వంటి శరీరచ్ఛాయ. చంద్రునివంటి మోము, మృగ నయనాలో అన్నట్లు కండ్లు, కాని పాప మా కండ్లలో వేడిమికి బదులు చల్లదనమే కనిపిస్తూంది. ముఖంపై ఆశకు బదులు నిరాశే ప్రస్ఫుటిత మవుతూంది. ఆ శరీరచ్ఛాయలో కాంతికి శాంతి తోడయింది. సంఘంలో జరిగే ఉత్సవ—వినోదాలకు, గౌరవ మర్యాదలకు ఆమె దూరంగా వుంచబడుతూంది. సుఖం అనేది ఆమె కందని పండు. క్లిష్ట పరిస్థితులే ఆమెకు నివాస స్థానము. మానసిక క్లేశమే ఆమెకు ముఖ్యస్నేహితురాలు. ఘోరము, మహా అన్యాయము. మానవత్వానికే తీరని యపరాధమది." ఆయన తండ్రి మరునాడు తన డైరీలోని యీ వ్రాతను చూచి ఆదిలో కంగారుపడ్డాడు. కాని తరు వాత అర్థం జేసుకొన్నాడు. శరత్ చంద్రుని మనస్సులో అంకురించ బోతున్న త్యాగనిరతి. న్యాయపరత, కార్యదీక్ష లకు లోలోన సంతసించాడు. యీ విధంగా డైరీలేగాదు. ఏ కాగితం కనబడినా దానిపై ఏదో గీచి పారవేశేవాడు. ఆ రచనాభిలాష క్రమేణా పెరుగుతూనే వచ్చిందిగాని, తగ్గలేదు.

ఆయన తరచు కథలనే వ్రాస్తూవుండేవాడు. ఆ కథలను ప్రచురించవలయునని అభిలాష బలంగా కలిగింది. అయినా తన కథలపట్ల పూర్తి నమ్మకమాయనకే లేదప్పటికి. వాటిని యితరులకు చూపించుటకే సందేహించేవాడు. అసలవి ప్రచురణయోగ్యములో కావో అనే అనుమాన మాయనను బాధిస్తూనే వుండేది. అవి కేవలం తన స్వంత భావాలనే ఆయన నమ్మకము ఒకప్పటికి భారతదేశంలో సాటిలేని సాహిత్యవేత్తగా రాణించగలనని ఆయన కప్పటికి కలనైనా నూహించలేదు. అయినా ప్రతిభ అనేది దాగరకే పోదుగదా! సమయం కొరకు కెదురుచూస్తుంటుందది రాణించేందుకు. శరత్ పట్లకూడ అక్షరాల యిదే జరిగింది. ఈ లోపుగా స్వదేశీ నూనెకంపెనీవారు భారత దేశంలో తమనూనె ప్రచారనిమిత్తం ఒక కథల పోటీనేర్పరిచారు. శరత్ తన మామగారి ప్రోత్సాహంవల్ల ఆ పోటీకి తన కథనొక దానిని తన మామగారి పేర పంపించాడు. అదృష్టవశాత్తు మన శరత్ చంద్రుని కథకే అప్పట్లో ప్రథమ బహుమతి లభించింది. శరత్ ఆనందానికి మేరలేదు. ఆయనలో ఆత్మ విశ్వాసమేర్పడింది. ఇది జరిగింది ఆయన బర్మా వెళ్లేముందు.

## బర్మాలో

శరత్ చంద్రుడు పూర్వ నిర్ణయంప్రకారం మిత్రుల ప్రోత్సాహంతో బర్మా వెళ్ళాడు. బర్మాలో ఆయన సుఖంగా జీవితం గడపలేదు. అడుగడుగునకు కష్టాల నెదుర్కొనవలసి

వచ్చినది. వెళ్ళిన కొలది రోజులవరకు ఆయన మిత్రుల యింట అతిథిగానే కాలం గడపవలసి వచ్చింది. కాని సోమరి పోతులా వారింట ఎక్కువ దినములుండుట అయన కిష్టం లేదు. ఏదో స్వతంత్ర ప్రయత్నం ప్రారంభించాడు, జీవన యాత్ర సాగించేందుకు. ఆ అపరిచిత దేశంలో ఆయన కుద్యోగ మెవరిస్తారు? చాలకాలం కూలివారిమధ్య కూలి చేసుకుంటూ కాలం గడిపాడు. వారి జీవితాన్ని పూర్తిగా అకళింపు జేసుకొన్నాడు. వారిపట్ల ఆయనకు పూర్తిగా సహానుభూతి కలిగింది. తన కొలది సంపాదనలోనుంచే ఆయన తనతోటి నిరుపేదలకు ద్రవ్యసహాయం కూడ చేసే వాడు. వారి కష్ట నష్టాల నాయన పంచుకుంటూ వుండే వాడు. యీ విధమైన చిక్కు పరిస్థితిలో కూడ ఆయన తన స్వగృహంలోనున్న తన సోదరికి కొంత ధనం ప్రతినెల పంపించే ప్రయత్నం చేసేవాడు. వీటినన్నిటిని నిర్వహించడం ఆ లేమిస్థితిలో ఆయనకు చాల కష్టమనిపించింది. అయినా ధైర్యంతో జీవన నౌకను ముందుకు సాగించాడు. నిరుపేదల మధ్యనుండి వారి కష్ట సుఖాలలో భాగం పంచుకుంటూ వుండడం వలన ఆయన గౌరవం పెరిగింది. ఈ లోపుగా అతి ప్రయాసపై నాయన కొక యింజనీరు కార్యాలయంలో గుమస్తాపని దొరికింది. ఇంతవర కెదుర్కొన్న కొన్ని చిక్కులు మాత్రం తొలగినవి. కాని సమస్యలు మాత్రం తప్పలేదు.

## వివాహము

ఒకదినం రంగూనులోని ఒక హోటలునుంచి భోజనం చేసి బయటకు వస్తూవుండగా తలపని తలంపుగా నొక బెంగాలీ యువతి ఆయన కెదురుగా రావడం తటస్థించింది. ఆమె చాల కంగారుగా తనను రక్షించమని ప్రాధేయపడింది. శరత్ కంగారుపడ్డాడు, ఆశ్చర్యపడ్డాడు. ఆమె నెక్కడో చూచి నట్లుగా ఆతనికి స్ఫురించింది. ఆలోచించగా ఆమె నొకసారి కలకత్తాలో నొకసంగీతసభలో చూచినట్లుగా జ్ఞప్తికొచ్చింది. వెంటనే బెబ్బులి బారినుండి తప్పించుకొన్న లేడివలె వణకు చున్న ఆ యువతి నోదార్చి హోటలులోనికి తీసికొని వెళ్ళాడు. అచ్చట నామె భయానికి కారణమడుగగా యీ విధంగా చెప్పింది— "చిన్నతనంలోనే నా వివాహం జరిగింది. రెండుసంవత్సరములు నిండక పూర్వమే నేను విధవ నయ్యాను. నా అత్తగారు ధనానికాశించి నన్నొక నీచుని కమ్మివేసింది. ఆ నీచుని స్వాధీనంలో నేను క్రూరహింసల పాలయ్యాను. అతను నన్ను పెట్టరాని బాధలు పెట్టాడు. ఆ అఘాయిత్యాలకు, అవమానానికి వెరచి అచ్చట నుండి ఎలాగో తప్పించుకొని నా తండ్రిదగ్గరకు చేరాను. కాని 'మూకుట్లోనుంచి జారి పొయ్యిలోపడ్డా'ను. నా తండ్రికూడ హీన మనో ప్రవృత్తి గలవాడు. అతడు నన్ను బర్మాలోని ఒక దుర్మార్గుడైన ముస్లిం యువకున కమ్మివేశాడు. ఏడు దినములనుండి నేను వాడి నరకతుల్యమైన బంధిఖానాలో నున్నాను. ఏదోవిధంగా యిప్పుడు తప్పించుకొని బయట

పడ్డాను. మరల ఆ రాక్షసుడు వస్తాడేమో! నన్ను పట్టుకుంటాడేమో! నాకు చాల భయంగావుంది. మీరు నన్ను రక్షించండి. నన్ను ఆదరించండి. లేకపోతే ఆత్మహత్య శరణ్యము.'' అని వ్రాసుకుంది. శరత్ చంద్రుని హృదయం తల్లడిల్లింది. తటపటాయించింది, తెప్పరిల్లింది. సంఘంలో జరిగే ఘోర దురాచారాలలో మరి యొకటి ఆయన అనుభవములో కొచ్చింది. సంఘంలో జరిగే దురంతాలకు బలిఅయ్యే నిర్భాగ్యులపట్ల ఆయనకుగల సహానుభూతి పరాకాష్ట నందుకుంది. దిక్కులేని మానవతి కభయమిచ్చాడు. కాని ఆమె జీవితసమస్య సమస్యగానే వుండిపోయింది. ఆయన తీవ్రంగా యోచించాడు. ఒక పరిష్కారాని కొచ్చాడు. ఆమెలో ఆత్మవిశ్వాసం కలగించి ఆమె జీవితాన్ని చక్కజేయుటకై ఆమె తండ్రికి కొంతధనమిచ్చి ఆమెనే వివాహమాడాడు. ఎంత త్యాగమో ఆలోచించండి!

## సాహిత్య క్షేత్రంలో

బర్మాలోవుండే రోజుల్లో ఆయన చాల కథలు, నవలలు వ్రాశాడు. పత్రికలకు పంపక వాటి నాయన తన దగ్గరనే వుంచుకొనేవాడు. ఎంతవరకు వ్రాయుటతప్ప వాటిని ప్రచురణకు పంపించ వలెననే కోర్కె మాత్ర మాయన కంత బలంగా వుండేదిగాదు. అది సహజంగా సాహితీపరునకుండే లక్షణ మనుకుంటాను. ఆ రోజుల్లో శరత్ చంద్రుడు బస చేస్తున్న యింటికొక పర్యాయం ప్రమాదవశాత్తు నిప్పంటు

కున్నది. భారతజాతి దురదృష్ట వశాత్తు ఆయన రచించిన కథలు, నవలలు చాలభాగం అగ్నిదేవునికి ఆహుతి అయి పోయినవి. ఆయన మనస్సు క్షోభించింది. కాని సంతోషించ వలసిందేమంటే అగ్ని ప్రమాదం నుండి బ్రతికి బయటపడ్డ ఆయన కొలది రచనలలో ప్రసిద్ధ నవలారాజము దేవదాసు వుంది అవిగాక శరత్ రచించిన హెచ్చురచనల యొక్క-వ్రాతప్రతులు కలకత్తాలో ఆయన మిత్రులయింట వుండి పోయినవి. శరత్ చంద్రుడు వలదన్నను వినక వారాయన రచనలను ప్రచురణార్థం మాసపత్రికలకు పంపేవారు. 'భారతి' అనే సుప్రసిద్ధ బెంగాలీ మాసపత్రికలో ప్రథమంగా శరత్ చంద్రుని చిన్ననవల 'దీదీ' ప్రచురించబడింది. నవలా ప్రపంచానికి 'దీదీ' నూతనోత్సాహాన్ని కలుగజేసింది. నాలుగు వైపులనుంచి నవలపై ప్రశంసల వర్షం గురిసింది. ఆ నవలారచయితయొక్క- ప్రతిభను కొనియాడుతూ అనేక మంది తమ శుభాకాంక్షలను తెలిపారు. ప్రజలలో రవి బాబే దీనిని రచించి మారుపేరుతో ప్రచురించినారన్న వదంతి బయలుదేరింది. కాని రవిబాబు ఆ అపోహను ఖండించారు. శరత్ చంద్రుని మిత్రులు ఆ తరువాత 'హరిచరణ్', 'బాల్యస్మృతి', 'కాశీనాథ్' అనే ఆయన యితర రచనలను 'సాహిత్య' అనే పత్రికకు పంపారు. ఈ కథలతో శరత్ చంద్రుని పేరు కథా ప్రపంచంలో తనస్థానం సంపాదించు కుంది. ఆ రోజులలో కొందరు ఉత్సాహవంతులైన బెంగాలీ యువకులు 'యమున' అనే సాహితీ పత్రిక స్థాపించారు. వారు శరత్‌కు తమ పత్రికకొక కథను పంపించవలసినదిగా కోరారు.

వారి కోరికను మన్నించి ఆయన ఆ పత్రికకు (రామేరసుమతి) అనే కథను పంపించాడు. ఇక చూడండి! ఆ కథతో ఆ పత్రిక యొక్క గ్రాహకసంఖ్య (Circulation) ఏబది నుంచి అయిదు వందల వరకు పెరిగింది. ఆ తరువాత 'పదనిర్దేశ్' 'బిందుర ఛేలే' అనే కథలు ప్రచురించ బడ్డాయి. వీటితో కథా రచయితగా ఆయన ప్రసిద్ధి నలువైపుల వ్యాపించింది. ఆ రోజులలో బెంగాలులో D. L. Roy అనే సుప్రసిద్ధ నాటకకారుడుండేవాడు. ఆయన 'భరతవర్షము' అనే పత్రిక నొకదానిని నడపుతూండేవాడు. శరత్చంద్రుడా పత్రికకు 'చరిత్రహీను'లనే నవల పంపించాడు కాని ఆ నవల విప్లవ పూరిత మగుటచే సంపాదవర్గం దానిని ప్రచురించ నిరాక రించింది. శరత్ మనస్సుకు కొంచెం బాధ కలిగింది. అయినా నిరాశమాత్రం కలుగలేదు. ఆయన మిత్రులాయనను నవలా రచనకు ప్రోత్సహిస్తూనే యున్నారు. ఆ రోజులలోనే ఆయన ప్రసిద్ధనవల 'బిరాజబహూ' వెలువడింది.

## బర్మానుండి కలకత్తా

ఇంతవరకు శరత్చంద్రుడు బర్మాలోనే ఉంటూవచ్చాడు. ఆయన కిప్పుడు ఆ కంపెనీలో పనిచేసే ఆంగ్లేయ వుద్యోగితో కలహం సంభవించింది. ఆ వుద్యోగి శరత్ నవమాన పర్చాడు. శరత్ ఆత్మాభిమాని. అవమానానికి తలవంచి వుంచే ధీరుడు కాదాయన. ఆ ఆంగ్లేయుని విదలించి ఆయన తన గుమాస్తా గిరికి రాజీనామా నందజేశాడు. రాజీనామా నిచ్చాడేగాని ఆయన తన భావిజీవిత మెట్లాగా అనిమాత్రం

భయపడ్డాడు. కాని యింతలో కలకత్తానుంచి ఆయన మిత్రుడొక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలో ఆయన కలకత్తాలో ఒక ప్రముఖ పత్రికా కార్యాలయంలో శరత్‌కు తగిన వుద్యోగముందనియు అది ఉత్తరోత్తరా శరత్ అభివృద్ధికి తోడ్పడుననియు, అందుకు వెంటనే బయలుదేరి కలకత్తా రావలయుననియు సూచించినాడు. ఆ వుద్యోగమునకు వేతనము నూరు రూపాయిలు. శరత్‌చంద్రునికి వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లయినది. వెంటనే ఆయన తన భార్యతో రంగూను వదలి కలకత్తాకు బయలుదేరాడు.

## రాబడి పెరిగింది

శరత్‌చంద్రుని ఖ్యాతి నలుమూలల ప్రాకింది. ఆయన రచనలు చదివేవారి సంఖ్య యినుమడించింది. వంగదేశమాయనకు సహర్షంగా స్వాగతం చెప్పింది. గ్రంథ ప్రకాశకులాయన రచనలను అచ్చువేయించడానికి పోటీపడ సాగారు. సంవత్సరమునకు ఆరువేల రూపాయలిచ్చే షరతుపై పబ్లిషర్సు ఆయన 'బిరాజ్‌బహూ' బిందురచ్ఛేలే నవలల ప్రకాశనాధికారాన్ని కొన్నారు. ఆ తరువాత కొన్ని రోజులకు ప్రకాశకులు (Publishere) ఆయన పుస్తకము లన్నిటికి సంక్షిప్త సంస్కరణ లచ్చువేయించ వలయునని భావించారు. అందుకొరకు శరత్ సమ్మతి నర్థించారు. కమిషన్ రు. 8000 వరకు పెంచారు. కాని శరత్‌చంద్రుడు అలాచేస్తే ఆయన మంచి పుస్తకములయొక్క అమ్మకమునకు దెబ్బ తగులగలదని

భావించి భయపడ్డాడు. కాని రెండు వేల రూప్యముల ధన మున కాశించి సంవత్సరమునకు రు. 8000 కమిషన్‌పై ప్రకాశ కులకు తన పుస్తకములకు సంక్షిప్త సంస్కరణ లచ్చువే యించడాని కధికార మిచ్చాడు ఒక సంవత్సరం గడిచిందో లేదో ఆయన రాబడిపై ఆయనకే విస్మయం కలిగింది. క్రొత్తగా వేయించిన సంక్షిప్త సంస్కరణలపైనే ఆయనకు రు.8000 ఆదాయం రాసాగింది. మొత్తం రు14000 వరకాయన సంవత్సరాదాయం పెరిగింది. శరత్ తనకింత ఆదాయమొస్తుం దని యింతకుముం దెన్నడూ అనుకొనలేదు. ఆ రోజులలోనే ఆయన రచించిన 'చరిత్రహీనులు' 'శ్రీకాంత్' 'దత్తా' 'గృహదహనం' 'శేషప్రశ్న' 'విప్రదాసు' 'పథేరదాపీ' మొద లుగా గల నవలలు అచ్చువడినవి. ప్రజలాయన రచనల కొరకు అర్రులు చాచ సాగారు. ప్రకాశకులాయన యింటి ముందు తిష్టవేశారు. దేశం నలుమూలల ఆయన పేరు ప్రతిధ్వ నించింది. సమాజమూ ఆయన నవలలను కళ్ళ కద్దుకుంది.

## రాజకీయవేత్తలతో స్నేహము

ఆ రోజులలో వంగదేశంలో ప్రముఖ రాజకీయ ధురంధరు డైన చిత్తరంజన్‌దాసు ఒక మాసపత్రిక నడుపుతూండే వాడు. శరత్‌బాబు పేరు ఆయనవరకు కెళ్ళింది. ఆయన శరత్‌కు తన పత్రిక కొక కథ నంపవలసినదిగా వ్రాశాడు. వ్రాయడమనే తడవుగా శరత్ సంతోషంతో 'స్వామి' అనేకథ వ్రాసి పంపాడు. కథ చూచి సి. ఆర్. దాస్ గారికి పట్టలేని

ఆనందం కలిగింది. శరత్ అంటే ఆయన కెంతో ఎంతో అభిమాన మేర్పడింది. బ్యాంకి చెక్కుపై ఏమి వ్రాయకుండ ఖాళీగాపంపి మీ యిష్టమొచ్చిన మొత్తం వ్రాసుకోమని శరత్‌కు వ్రాశాడాయన. చూడండి ఎంతగా ప్రభావితుడయినాడో! శరత్ ఆ చెక్కుపై కేవలం ఒక వందరూపాయిలు వ్రాసుకున్నాడు. అప్పటినుంచి చిత్తరంజన్‌దాసుగారికి శరత్ బాబుకు గాఢమైత్రేర్పడింది. ప్రముఖ వైజ్ఞానికుడు ప్రఫుల్ల చంద్రరాయి, శరత్ నవలలను చాల ఆప్యాయంగాను, శ్రద్ధతోను చదివేవాడు. సుభాష్‌చంద్రబోసుకూడ శరత్‌ను అమితంగా గౌరవించేవాడు. శరత్ కూడ సహజంగా విప్లవవాది. విప్లవవాదుల కార్యకలాపాలను ఆయన శ్రద్ధతో గమనిస్తూండేవాడు. వారిపట్ల ఆయనకు అమితమైన సహానుభూతి వుండేది. ప్రభుత్వపు గూఢచారుల దళానికి చెందిన కొందరు పోలీసులు శరత్‌ను కనిపెట్టి వుండేవారు. కాని వారాయననేమీ చేయలేకపోయారు. ఆ రోజులలో ఆయన రచించిన 'పథేరదావీ' అనే విప్లవ పూరితమైన నవలను మాత్రం గవర్నమెంటువారు జప్తుచేయించారు. విప్లవ కారులంటే ఆయనకు అమిత సంతోషం. వారికి ఆశ్రయ మివ్వడం దగ్గర నుంచి వారికి ధనసహాయం వరకుకూడ చేసేవాడు. ఒక పర్యాయం ప్రముఖ విప్లవకారుడు రాస బిహారీబోసుకు కూడ ధన సహాయం చేశాడు. విప్లవకారుడైన ఒక ఖైదీ హావురా జైలునుంచి తప్పించుకొని పారిపోయివస్తే అతని కాశ్రయ మిచ్చి కొన్ని దినముల తరువాత అతనినే తనయింట నౌకరుగా నియమించుకున్నాడు.

శరత్ చంద్రుడు కలకత్తా కాంగ్రెసు సంఘానికి సెక్రటరిగాను ప్రెసిడెంటుగాను పనిచేశాడు. ఆయనకు అహింసపై అంతగా నమ్మకముండేదిగాదు. అన్యాయాన్ని సహించడం ఆయన దృష్టిలో ఒక విధమైన పిరికితనము. ఆయన కార్యశూరుడు. తన భావాలను వ్రాతలలో చూపించేవాడేగాని ఉపన్యాసాల ద్వారా మాత్రం గాదు. అసలాయనకు సభలలో ఉపన్యసించడమే తెలియదు. ఇంతటి విప్లవవాది, కార్యశూరుడు, అయినప్పటికిని ఆయనకు సభలలో మాట్లాడే కళే అలవడ లేదు. ప్రముఖ వంగసాహిత్యవేత్త సత్యేంద్రబాబు అస్త మించినప్పుడు సంతాపసభ జరుపబడింది. దానికి శరత్ బాబు అధ్యక్షత వహించాడు. సి. ఆర్. దాసు, సుభాష్ బాబు, డి. యల్. రాయి మొదలుగాగల ప్రముఖులందరు ఆ సభకు హాజరయినారు. వారంద రుపన్యసించిన తరువాత అధ్యక్ష పీఠంనుంచి శరత్ ఉపన్యసించవలసి వచ్చింది. ఆయన కేమి మాట్లాడవలయునో స్ఫురించలేదు. సభలో లేచి నిలబడేప్ప టికే ఆయన భావాలన్నీ లోలోనే యింకిపోయినవి. అతి కష్టంమీద నాలుగు వాక్యాలు మాట్లాడాడు. కాని, ఆ చెప్పిన మాటలు కఠోర సత్యాన్ని మాత్రం వెల్లడి చేస్తున్నవి. లాంఛన పూర్వకంగా సంభోధనలని అయిన తదుపరి ఆయన చెప్పిన రెండు ముక్కలివి.—"సత్యేంద్రుడు మన మధ్య లేడు. యిక రాడు. యిప్పుడాయనిను మనం గౌరవిస్తు న్నాము విశేషంగా. కాని ఆయన జీవించియుండగా మాత్రం మన మాయన ముఖంకూడ చూడలేదు. అనేక యిబ్బం దులు పడ్డాడు" వినుటకు కొంచెం కఠోరంగా కనిపించినా యిది అక్షరాల నిజము. దీనినే కఠోర సత్యమంటాము.

వేదికపై ఉపన్యాసాన్ని ఒక కళగా అభ్యసించే వాక్ప్రియులు ఇనుప వస్తువుకు బంగారపు పూతపెడతారు. కాని, దానిని కళగా అభ్యసించలేని అధ్యయన శీలురయొక్క బంగారు వస్తువు యినుపరేకులో యిమిడిపోతుంది దాని కొరకొరకరు చేయగలిగిందేమీకూడ లేదేమోననుకుంటా!

## రోగశయ్యమీద

శరత్ చంద్రుని జీవితమంతా సంఘర్షణలతోనే నిండివుంది. పరిస్థితులతో నాయన జరిపిన పోరాటమే ఆయన జీవితము. జీవితంలో ఆయన అనేక కష్టాల నెదుర్కొన్నాడు. అమితమైన కృషి చేశాడు. ఆయన శ్రీమంతుడుగాదు. కష్టజీవి. కష్టించాడు, చెమటోడ్చాడు, సృష్టించాడు, పయనించాడు. ఆయన శ్రమఫలితా న్నీరోజున మన మనుభవిస్తున్నాము. జీవితంలో ఆయన సుఖమెరుగడు. కష్టాలు పదిహేనణాలు, సుఖాలు ఒకణా వంతునే ఆయన లభ్యమయినవి. ఆయన పుస్తకములపై వచ్చిన ఆదాయాన్ని ఆయన కూడబెట్టుకొనలేదు. ఎక్కువ దానధర్మాలకే ఖర్చు చేశాడు. తత్ఫలితంగా ఆయన తన చివరి రోజులలో బాధపడ్డాడు

మరి ఎలా అలవడిందో ఏమోగాని శరత్ కు మద్యము సేవించే అలవాటుండేది. దానివల్లగాని మరియే ఇతరకారణంవల్లగాని, ఆయన ఆరోగ్యమెప్పుడూ సంతోషకరంగా నుండేదిగాదు. ఏదో ఒక అస్వస్థత ఉంటూవుండేది. ఏదోచేయాలనే బలమైన కాంక్షలో ఆయన తన అనారోగ్యాన్ని మరచి పోయేవాడు. కాని తన శరీరం ఆరవ దశకంలో పడినకొలది ఆయన తన అస్వస్థతకు లొంగుతూ వచ్చాడు. తరువాత క్రమంగా మంచం

పట్టాడు. డాక్టర్లాయన ఊపిరితిత్తులు చెడినవని చెప్పారు. ఆఖరి దశలో పబ్లిషర్స్ కూడ ఆయనకివ్వవలసిన ధనాన్ని సక్రమంగా యివ్వనందువలన ఆర్థికంగాకూడ యిరుకున పడ్డాడు. ఎలాగో ధనం సమకూర్చి అయన మిత్రులాయనను హాస్పటల్‌లో (Park Nursing-home) చేర్పించారు. క్రమేణా ఆయన ఊపిరితిత్తులు క్రుళ్ళిపోయినవి. పరిస్థితి విషమించినది. 1938 సంవత్సరం జనవరి మొదటిరోజు ఉదయం పదిగంటల కాయన తన భౌతిక దేహం చాలించాడు. సాహిత్యప్రపంచం స్తంభించింది. సమాజము విలపించింది. ఆయన కలం శాపుకు మంది. కాని ఏం లాభం? అది సృష్టి నియమం. వైభవంగా ఆయన దహన సంస్కారం జరుపబడింది. ఆయన పాంచ భౌతికశరీరం పంచభూతాలలో లీనమైపోయింది.

## ముగింపు

శరత్ చంద్రుని అస్తమయంతో భారత సాహిత్యాకాశము నందొక దేదీప్యమానమైన నక్షత్రం రాలి పోయింది. ప్రపంచ కథా రచయితల్లో ఆయనొక ప్రముఖస్థానం సంపాదించాడు. ఒక బెంగాలు లోనే కాకుండ సమస్త భారత దేశంలో తన కథా రచన ద్వారా ఆయనొక విప్లవాన్ని లేవ దీశాడు. భారత దేశంలో హెచ్చు సంఖ్యగా నున్న రైతువర్గము, దానికి సంబంధించిన సమస్యలను హిందీలో ప్రేమచంద్ కళ్లకు కట్టినట్లు చిత్రించాడు. అలాగే సమాజంలోని శిక్షిత, అర్థశిక్షిత వర్గంలో పేరుకు పోయిన అంధ విశ్వాసాలను, కుల సాంప్రదాయాలను నిష్పష్టంగా బెంగాలీలో శరత్ చంద్రుడు చిత్రించాడు. ఆయన రచనలన్ని యించుమించు భారతీయ భాష లన్నిటిలోనికి అనువదించ బడినవి. ఈ విషయంలో

తెలుగువారు ముందుగానే మేల్కొన్నారనుకుంటాను. శరత్ రచనలలో ప్రతి పాత్ర ఒక మనోవైజ్ఞానికి సత్యం. ఒక మహోన్నతాదర్శము. పాత్రలయొక్క వ్యక్తిత్వ చిత్రణ అమోఘం. అది పాఠకుని మనస్సు కలచివేస్తుంది. అది ఆతనిని సంవేదనా స్పందితుని చేస్తుంది. దేవదాసు నవలలో దేవదాసు పతితుడై క్షయరోగ గ్రస్తుడై మృత్యు ముఖంలో నున్నప్పుడు పార్వతి యింటికి వస్తాడు. ఆ అభాగ్యుడప్పుడు ఆ యింటి ద్వారం దగ్గరే బయట పడిపోయి ప్రాణం వదలుతాడు. ఆ దృశ్యాన్ని, సంఘటనను శరత్ — 'అందరూ చస్తారు, తప్పదు. చావొచ్చు కాని చనిపోయేప్పుడు అతని తలను ప్రేమతో, వాత్సల్యంతో నిమిరి అతని కొరకు ఒక ఏడ్పయినా ఏడ్చేవారు లేని స్థితిలో చావడం ఘోర దురదృష్టమనే చెప్పాలి.' అని వ్యాఖ్యానించాడు.

శరత్ చంద్రుడు సమన్వయవాది. ధర్మము పేరుతోను, సంప్రదాయం పేరుతోను మానవత్వాన్ని మంట కలిపే రూఢివాదులంటే ఆయనకు మహాచెడ్డ చిరాకు. ముస్లింతో తన యింట నమాజు చదివించుకునేవాడు. అన్ని మతాలను ఆయన ఒకే విధమైన దైవ విశ్వాస జనితాలుగా భావించాడు. ముస్లిం సమాజ పరిస్థితులకు సంబంధించిన నవల నొకదానిని వ్రాయ వలయునని ఆఖరి దినములలో నాయన అభిలషించాడు. కాని మృత్యుదేవత అందు కంగీక రించలేదు. రవీంద్రునితో శరత్‌కు గల సంబంధాన్ని ప్రజలు అనేక విధాలుగా చెప్పుకుంటారు. ఆయనతో శరత్‌కు పొసగ దనియు యిరువురిలో అనేక విషయాలపై అభిప్రాయ భేధా

లున్నవనియు, ఆయనను యీాయన గర్హించినాడనియు, రకరకాల అపోహ లున్నవి. కాని అవన్ని ఊహాజనితాలే. శరత్ బాబు రవిబాబు నెప్పుడు చిన్న దృష్టితో చూడలేదు. ఆయనను హెచ్చుగా గౌరవించేవాడు. అదిగాక ఆయన రచలనుండి తాను అనేక విషయాలను నేర్చుకొన్నా ననియు, అనేక సందర్భాలలో రవీంద్రుని రచనలు తనకు ఆరోగ్యకరమైన ప్రోత్సాహ మిచ్చినవనియు శరత్ బాబు స్వయంగా చెప్పియున్నాడు. రవిబాబుకంటె శరత్ 15 సం॥ చిన్నవాడు. దీనిని బట్టికూడ శరత్ రవిబాబును గురుతుల్యునిగా కూడ భావించి యుంటాడని ఒప్పుకొన వలసియున్నది. ఒక రవిబాబునే గాదు శరత్ బాబు సుప్రసిద్ధ నాటకకారుడు ద్విజేంద్ర లాల్ రాయిని కూడ పూజ్యునిగా భావించాడు. శ్రీ రాయికూడ శరత్ కంటె 12 సం॥ పెద్దవాడే. రాయి ద్వారా ఒకప్పుడు శరత్ కు నిరుత్సాహం కలిగినప్పటికిని ఆ తరువాత ఆ యిరువురు కళారాధకులు ఒకరినొకరు అర్థం జేసుకున్నారు. ఈ విధంగామన శరతుబాబు పెద్దలయెడ గౌరవంతో, పిల్లలయెడ ఆదరంతో మెలుగుతూ తన స్వయం కృషిద్వారా కళాతపస్విగా రూపొందినాడు. కళారాధకుడైన శరతుబాబు భౌతిక దేహము మనమధ్య లేకపోయినప్పటికిని ఆయన పవిత్ర ఆత్మ ఆయన రచనలలోనుంచి మనకు దివ్య మార్గాన్ని ప్రభోధిస్తూనేవుంది. భారతజాతిమనుగడ వున్నంత వరకు అది భారతజాతికి నూతన జవసత్వాలను కలిగిస్తూనే వుంటుంది